*Issued on 6-9-1958*

Volume XVI

No. 1




2nd July, 1958
(Wednesday)

# Andhra Pradesh Legislative Assembly Debates

## Part II— Proceedings other than Questions and Answers

## OFFICIAL REPORT

---

CONTENTS



NOTE: * at the commencement of the speech denotes confirmation from the Member not received in time.

Printed by Ajanta Printers, Secunderabad,
for the Director, Government Printing Press, Hyderabad-A. P.

# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

[*Part II — Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

---

*Sixty-second day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Wednesday, the 2nd July,* 1958

The House met at Three of the Clock

[ MR. SPEAKER IN THE CHAIR ]

## QUESTIONS AND ANSWERS

( SEE PART I )

## BUSINESS OF THE HOUSE

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ): అధ్యక్షా! నిన్న కాక మొన్న రూలు 70 (ఎ) క్రింద drawing the attention అని మీ జ్ఞప్తికి తీసుకొనివచ్చాను. అది చాలా ముఖ్యమైనది, తక్షణం తెలియజేయవలసినటువంటి విషయం. ఏమిటి అంటే నందిగామ స్కూలు సెంటరులో విద్యార్థుల పరీక్షా ఫలితాలు నేటివరకు కూడ ప్రకటింపబడలేదు. అందుచేత అక్కడ విద్యార్థులకు చాలా యిబ్బంది కలుగుచున్నది. Institutions లో సీట్లు అయిపోతున్నాయి. విద్యార్థులకు ఏమి చేయాలో బోధపడడంలేదు.

మిస్టర్ స్పీకర్ : మంత్రిగారు ఈవేళే వచ్చారు. మీరు యిచ్చిన కాగితం ఈరోజున అందుతుంది. జవాబు చెప్పడానికి ఉంటే రేపు చెబుతారు.

విద్యాశాఖ మంత్రి (శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు) : రేపు ప్రొద్దున చెప్పడానికి వీలుపడదు. ఈ రోజు మధ్యాహ్నమే నాకు చేరింది. అది ఆఫీసుకు వెళ్ళిరావాలి. ఎల్లుండికి information యివ్వగలుగుతానేమో !

మిస్టర్ స్పీకర్ : సరే!

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : అధ్యక్షా, ఆ ఆఫీసు ఎంతో దూరములో లేదు. ఏబిడ్ రోడ్డులోనే ఉన్నది. ఫోనుచేసి తెలుసుకోవచ్చు.

మిస్టర్ స్పీకర్ : అవన్నీ లాభంలేదు. కూర్చోండి. ఇప్పుడు ఎవరూ ఏమీ చేయలేరు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (పదమలమేట) : 74 రూలు క్రింద నేను నోటీసు యిచ్చాను. ఏమి అయింది ?

మిస్టర్ స్పీకర్ : అదికూడ వస్తుంది, రేపో ఎల్లుండో ! వరుసలో !

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : ఎప్పుడు వస్తుంది ?

మిస్టర్ స్పీకర్ : ఎప్పుడు వస్తుందో నేను ఎట్లా చెప్పగలను ?

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : కొంపలు తగులబడి పోతోంటే...

మిస్టర్ స్పీకర్ : చాలాచోట్ల తగుల బడుతున్నవి. ఇక్కడ ఒకచోటే కాదు.

(Pause)

మిస్టర్ స్పీకర్ : మంత్రి పట్టాభిరామారావుగారు నన్ను అడుగుతున్నారు. యూనివర్సిటీ బిల్లు వచ్చి 5 రోజులుమాత్రమే అయింది. 27 న పబ్లిషు అయింది. వారంరోజులు కావాలి. దానికి 7 రోజులు పూర్తి కాకుండానే పర్మిషన్ యివ్వమని అడుగుతున్నారు. దీనికి సుందరయ్యగారు ఏమంటారు ? ఏదో ఒకటి ఈరోజు తీసుకొందాము. ఉస్మానియా, వెంకటేశ్వరా ఆంధ్ర తీసుకొందామా చెప్పండి.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) : అధ్యక్షా ! ఈ మూడుబిల్లులలో ఉన్న principle ఒక్కటే! ఈ మూడు ఒకటితరువాత ఒకటి చర్చిస్తూ కూర్చుంటామా ? లేకపోతే మూడింటిని ఒకేసారి ప్రతిపాదించి మూడింటిని కలిపి చర్చిద్దామా అనేది తేల్చుకోవలసి ఉంటుంది.

మిస్టర్ స్పీకర్ : అది ఎట్లా ? అన్నీ ఒకమాదిరిగా ఎట్లా ఉంటాయి ?

శ్రీ పి. సుందరయ్య : అన్నిటిలో ఒకేమాదిరిగా ఉంది.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : అధ్యక్షా ! ప్రతిపక్షనాయకులు చెప్పినట్లు చాలా విషయాలలో ఈమూడు ఒక్కటే ! మూడింటిని కలిపి discuss చేయడంలో ఎక్కువ లాభం ఉంటుంది. అన్నివిషయాలను డిస్కసు చేయడానికి సభ్యులకు అవకాశం ఉంటుంది. లేకపోతే same thing నే repeat చేయవలసివస్తుంది. అందుచేత మీరు అనుమతి యిస్తే మూడింటిని ఒకటి తరువాత ఒకటి move చేస్తాను. Discussion కు మాత్రం ఒకేసారి అనుమతిస్తే బాగుంటుంది.

మిస్టర్ స్పీకర్ : సుందరయ్యగారూ, రామకృష్ణరాజుగారూ మీ అభిప్రాయం ఏమిటి ? మూడింటిని కలిపి తీసుకొందామా ?

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : అట్లనే చేయండి.

మిస్టర్ స్పీకర్ : మూడింటిని ప్రతిపాదించిన తరువాత రెండు మూడు రోజులు చర్చ జరుపుదాము.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : ఈ వేళా, రేపునా ?

శ్రీ పి. సుందరయ్య : రేపుకూడ సాధ్యంకాదు.

మిస్టర్ స్పీకర్ : తరువాత చూదాము. I want to give full scope for all members.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : చిత్తం. ఈ బిల్లు సెలక్టు కమిటీకి కూడ వెడుతున్నది.

మిస్టర్ స్పీకర్ : వెళ్ళినా ఏమీ పరవాలేదు. వెళ్ళేముందు పూర్తిగా దానిమీద discussion జరగాలి.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : సరేనండి.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : మొన్న ఎస్టేట్సు అబాలిషన్ బిల్లుక్రింద కొన్ని రూల్సు రెవిన్యూమంత్రిగారు move చేయవలసి యున్నది. అదికూడ ఈ రోజునే జరగాలని అనుకొన్నాము. అది ఎప్పుడు వస్తుంది ?

మిస్టర్ స్పీకర్ : బిజినెస్ అడ్వయిజరీ కమిటి రేపు కలుస్తుంది. అందులో డిసైడు చేస్తాము.

## THE OSMANIA UNIVERSITY BILL, 1958
## THE ANDHRA UNIVERSITY (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1958
## SRI VENKATESWARA UNIVERSITY (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1958

*Sri S. B. P. Pattabhi Rama Rao*: Mr. Speaker, Sir, I beg to move:

"That the Osmania University Bill 1958 be read a first time."

"That the Andhra University (Andhra Pradesh Amendment) Bill, 1958 be read a fiirst time."

"That Sri Venkateswara University (Andhra Pradesh Amendment) Bill, 1958 be read a first time."

*Mr. Speaker*: Motion moved.

*Sri S. B. P. Pattabhi Rama Rao*: While moving the Bills Sir, I wish to state that the Osmania University is at present governed by the provisions of a revised Charter promulgated by the Nizam of Hyderabad on the 8th of December 1947. Since this revised charter was brought into force, India has become a Republic and great changes have occurred in the political, economic and social life of the country. There has been great demand from all sections of people for remodelling the University and its constitution. In response to the recommendations made by the University Education Commission as early as 1952 Sir, the senate of the Osmania University urged the Government to take early steps for undertaking a legislation in this regard. Time and again on the floor of the Assembly and even outside, there was a demand for introducing a progressive legislation. In fact, a private member introduced a bill in this regard some time ago in the Legislative Assembly, but it was withdrawn in view of the assurances given by the Government that they themselves intended to introduce such legislation. The great impediment in the way of early legislation in those days was the indecisive attitude adopted by the Government of India regarding the question of taking over the Osmania University under the management of the Central Government. In 1956 a bill was actually prepared by the former Government of Hyderabad but in view of the impending reorganisation of the States, it could not be proceeded with. After the formation of the Andhra Pradesh, the present Government considered that the proposal to undertake legislation might be considered in the present set up of the reorganised States. Accordingly, they constituted a committee consisting of my collegues, the hon. Ministers for Home, the then Finance Minister, Minister for Irrigation and Power and myself and the Vice Chancellors of the three Universities in the State viz., the Vice Chancellors of the Andhra, Osmania and Sri Venkateswara Universities, Mr. Madapati Hanumantha Rao, the Director of Public Instruction and the Secretary to Government, Education Department, to examine and suggest the lines on which the present Osmania University Charter might be replaced by an Act of Legislation. The committee made certain suggestions for revising the charter. While considering the suggestions the Government felt that the Committee should be enlarged so that the amendments to the Andhra and Sri Venkateswara University Acts also might be considered with a view to bringing about uniformity as far as possible in the

legislation pertaining to the three Universities in the State. Accordingly the committee was reconstituted by the addition of representatives of the Andhra and Sri Venkateswara Universities. The reconstituted committee after examining the draft bill prepared by the former Government of Hyderabad, the draft bill prepared by Sri M. S. Doraswami, formerly officiating Vice Chancellor of Osmania University and the provisions of the existing Andhra and Sri Venkateswara University Acts and all the other material available on the subject, came to a decision that the pattern of legislation for the Osmania University might be basically the same as that obtaining in the Andhra and Sri Venkateswara Universities. The committee considered, at the same time, that the Andhra University and Sri Venkateswara University Acts might be suitably amended so as to bring them into line with certain provisions which are being incorporated in the Osmania University Bill. On this basis, the committee made certain important recommendations for the revision of the Osmania University charter and the amendments of Andhra and Sri Venkateswara University Acts. These draft bills were prepared on the basis of these reeommendations and they were published in the Andhra Pradesh Gazette for eliciting public opinion. In addition to the views of the senates of the three Universities on the respective bills, suggestions and objections have also been received from several associations and individuals. Certain recommendations and suggestions made by the senates and other private bodies which are found to be acceptable have been incorporated in the Osmania University Bill which is now before you. I may add that this bill has been prepared with the greatest care possible and has received the best attention of the Government.

Before closing my speech, I may be permitted to say briefly a few words about these bills. In the first place, I may say that the draft of the bill closely follows the pattern, as I have already said, of the Andhra and Sri Venkateswara University Acts. The Government have incorporated in it modifications as recommended by the Committee. For the benefit of the employees of the University, provision has been made in the bill for the establishment of a Pension and Provident Fund Schemes. Provision has also been made in the bill for certain matters which now find place in the Statutes, Ordinances and regulations of the University with a view to give statutory basis and to protect the interests of staff and safe-guard the finances of the University.

As I have already mentioned, Sir, the Bills on the whole closely follow the pattern and legislation obtaining in the other

Universities in the State and contain the best features of legislation required for any modern University. I now request the House to accept the motion that the Bills be read a first time.

*శ్రీ రావినారాయణరెడ్డి (భువనగిరి): అధ్యక్షా! మాకు అందచేసిన ఈ మూడు విశ్వవిద్యాలయాల బిల్లులను చాలా జాగ్రత్తగానే చదివేందుకు ప్రయత్నించాను. అదేవిధంగా మంత్రిగారు చేసిన క్లుప్తమైన ఉపన్యాసమునుగూడ చాల జాగ్రత్తగానే విని ఆకళింపు చేసుకొనుటకు ప్రయత్నించాను. ప్రపంచములోని విశ్వవిద్యాలయాల యందుండే అన్ని మంచి విషయాలుకూడ ఈ బిల్లులో చేర్చబడినాయనీ; చాలా సక్రమమైన బిల్లు అని మంత్రిగారు సెలవిచ్చారు. కాని ఆ బిల్లుల పరిశీలనవల్ల ఆ విషయంలో నాకు నమ్మకము కలుగుటలేదు. కాగా చాల worst విషయాలను తెచ్చిపెట్టినట్లు తోచుచున్నది. ఉస్మానియా యూనివర్శిటీని ఆంధ్ర, తిరుపతి యూనివర్శిటీల పద్ధతులపైన మార్చినట్లుగా వారు చెప్పినారు. కాని చాలా ముఖ్యమైన విషయాలలో ఉస్మానియా యూనివర్శిటీ పద్ధతులపై వాటిని మార్చినట్లు కనబడుతున్నది. వైస్ చాన్సలర్ ఎన్నిక విషయంలో ఉస్మానియా యూనివర్శిటీలో ఎన్నిక పద్ధతి లేకుండెను ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో ఎన్నిక పద్ధతి ఉండేది. ఉస్మానియా యూనివర్శిటీ పక్కిలోనే వాటిని తీసుక వచ్చారు. ఈ ఎన్నికలపద్ధతి సక్రమమైనదా లేక నామినేషన్ పద్ధతి మంచిదా అని ఆలోచించాము, ఇప్పుడు ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో ఎన్నికపద్ధతిని తీసివేసి ఉస్మానియా యూనివర్శిటీ పద్ధతిని ప్రవేశపెట్టుటేగాక ఒక విచిత్రమైన 'ఢిల్లీ' పద్ధతిని ప్రవేశపెట్టారు. దాని ప్రకారం సిండికేట్ ఇద్దరు సభ్యులను నామినేట్ చేస్తుంది. గవర్నరుగారు ఒక సభ్యుని నామినేట్ చేస్తారు. ఈ ముగ్గురు సభ్యులు ముగ్గురిని నామినేట్ చేసి గవర్నరుగారికి పంపుతారు. గవర్నరు ఆ ముగ్గురినుండి ఒకరిని ఎంచుకోవాలి. వారికి ఇష్టంలేకపోతే ముగ్గురిని కూడ తిరగగొట్టవచ్చు. ఈ నామినేషన్ పద్ధతికంటె ఎన్నికల పద్ధతి చాలా ప్రజాస్వామ్య పద్ధతనే అభిప్రాయానికి వచ్చాము. దానిని గురించి భేదాభిప్రాయాలు ఉండవచ్చు. దానిని గురించి విద్యావేత్తలు వివిధమైన అభిప్రాయాలను వెల్లడించి ఉండవచ్చును. కాని ఒక్క విషయాన్ని మాత్రం మంత్రిగారికి చెప్పదలచుకున్నాను. వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్థాపన సందర్భంలో ఆంధ్ర ప్రభుత్వమే ఒక కమిటీని నియమించింది. వారు ఇతర రాష్ట్రాలు వివిధంగా ప్రవర్తించినప్పటికి, ఇది ఆంధ్రరాష్ట్ర అనుభవం; ఎన్నికల పద్ధతికి బదులుగా నామినేషన్ పద్ధతి ఉంటుందని చెప్పుటకు అవకాశం మేమాత్రమూ లేదని

స్పష్టంగా వ్రాశారు. మన అనుభవం దృష్ట్యా ఇతర యూనివర్శిటీలను కాపీ చేయవలసిన అగత్యం లేదని నా అభిప్రాయం. బహుశః ఇతర యూనివర్శిటీలే మనలను కాపీ చేయవలసి ఉంటుందేమో ? ఆంధ్ర, వెంకటేశ్వర యూనివర్శిటీ లలో యున్న ఉత్కృష్టమైన ఎన్నికపద్ధతిని వమ్ము చేశారు. అందు కేవో కారణాలు ఉండవచ్చు. దానిలో ఏవో ఇంట్రీగ్సు ఉన్నవని, రాజకీయాలు అడ్డంగా వస్తవని చెప్పవచ్చు. కాని ఏ దృక్పథంగా ఆలోచించినా అదే ఉత్తమ పద్ధతి. నామినేషన్ పద్ధతిలో మాత్రం రాజకీయాలు రావా ? దానివల్ల అధికార మంతా గవర్నరు చేతులలో ఉంటుంది. సిండికేట్‌లో మాత్రం corruption రాజకీయాలు నడువవా ? ప్రభుత్వంలోనే ఇన్ని తగాదాలు ఉన్నప్పుడు గవర్నరు మాత్రం అంత free గా చేస్తారా? ఐతే ఎన్నికల పద్ధతి లోప భూయిష్టం కాదని ఎవ్వరూ చెప్పలేరు. కాని దీనిలోకంటె నామినేషన్ పద్ధతిలో లోపాలు ఎక్కువగా ఉండుటకు అవకాశమున్నది కాబట్టి ఎన్నికల పద్ధతినే తిరిగి ప్రవేశపెట్టాలి ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వవిద్యాలయములలోనేగాక ఉస్మానియా విశ్వవిద్యాలయానికిగూడ ఆ పద్ధతినే వర్తింపచేయాలని మా ఉద్దేశం. ఇంకొక విషయమున్నది. డి. ఎస్. రెడ్డిగారు వైస్‌చాన్సలర్‌గా నామినేషన్ సమస్య వచ్చింది. దానిని గురించి అసెంబ్లీలోకూడ వాదప్రతివాదాలు జరిగినవి. డి. యస్. రెడ్డిగారంటే వ్యక్తిగతంగా మాకు ఆక్షేపణ ఏమీలేదు. వారు గొప్ప విద్యావేత్త. ఐనప్పటికిని వారిని ఉస్మానియా యూనివర్శిటీకి వైస్ ఛాన్సలర్‌గా ప్రవేశపెట్టిన పద్ధతిమాత్రం చాలా ఆక్షేపణీయంగాఉన్నది. ఇక్కడి విద్యార్థుల, ప్రజల సెంటిమెంట్సును దృష్టిలో పెట్టుకోకుండా ఆంధ్ర ప్రదేశ్, తెలంగాణ అనే భేదాభిప్రాయాలు తీవ్రంగా ఉన్న పరిస్థితులలో వారిని నామినేట్ చేయడం చాలా పొరపాటు అని మా పార్టీ తరఫున ఇదివరకు అనేకసార్లు చెప్పాము. ఒక తప్పుచేశాము. ఆ తప్పును ఉస్మానియా యూనివర్శిటీ తలపై రుద్దడమేగాక మిగతా రెండు యూనివర్శిటీలమీదగూడ రుద్దుటకు ప్రభుత్వము ప్రయత్నిస్తున్నదని చెప్పక తప్పదు.

ఆ తరువాత మాకు మరొకవిషయం తెలిసింది. అయితే ఆ సమయములో నేను యిక్కడ వుండడం తటస్థించలేదు. తరువాత యిక్కడకు వచ్చినపుడు reports ద్వారా తెలిసింది. ఉస్మానియా యూనివర్సిటీ వైస్-చాన్సలర్ ఎన్నిక సందర్భంలో కొన్ని కారణాల వల్ల యూనివర్సిటీ విద్యార్థులు సమ్మెచేస్తున్న సమయంలో మన హోంశాఖామాత్యులు వారి వద్దకు వెళ్ళి వారికి కొన్ని వాగ్దానాలు ఒసంగినట్లు మాకు తెలిసింది. అయితే ఆ సమయంలో మంత్రిగా రొసంగిన వాగ్దానాలు ఎంతవరకు ఆచరణలో సఫలమైనవో మాకు తరువాత

తెలియరాలేదు. ఆవిధంగా వాగ్దానాలు ఒసంగుటతోడనే ఆగక మంత్రిగారు " నా యీ అభిప్రాయాన్ని గనుక ప్రభుత్వం అంగీకరించని పక్షంలో నా మంత్రి పదవికి రాజీనామా యిస్తాను" అని కూడా మంత్రిగారు అభిప్రాయపడినట్లు తరువాత విశ్వసనీయ వర్గాల ద్వారా మాకు తెలిసింది. ఆ విషయమే పత్రికలలో కూడా వచ్చినట్లు మా మిత్రులు చెబుతున్నారు. అయితే మంత్రిగారు ఆవిధంగా విద్యార్థుల ఎదుట open గా వాగ్దానాలు చేసినమాట మాత్రం యథార్థం. మంత్రిమండలిలో సమిష్టి బాధ్యత ఉందనే నేను విశ్వసిస్తున్నాను. అటువంటప్పుడు మంత్రిగారు చేసిన వాగ్దానాలు ఎంతవరకు అమలు జరిగినవని ప్రభుత్వాన్ని నేను సూటిగా ప్రశ్నిస్తున్నాను. ఈనాడు ప్రభుత్వం ఎన్నికల పద్ధతిని పూర్తిగా తీసివేసి, నామినేషన్ పద్ధతి ప్రవేశపెట్టడం ఎంతవరకు సమంజసమో నాకర్థం కావడం లేదు. దీనివలన ప్రభుత్వం తానుచేసిన తప్పును చివరివరకూ కూడా కప్పిపుచ్చుకొనడానికి ప్రయత్నిస్తున్నట్లు స్పష్టమగుచున్నది. అందువలన ప్రస్తుత ఎన్నికల పద్ధతి ఎంతమాత్రము న్యాయసమ్మతము కావేరదు, సెనేట్ నుండి వైస్-ఛాన్సలర్ ను ఎన్నుకొనేపద్ధతే సమగ్రమైనదనీ మా పార్టీ యొక్క సమగ్రాభిప్రాయం. తరువాత యీ బిల్ లో ప్రత్యక్షంగా కనబడే మరో వివాదాస్పదమైన విషయమేమంటే— వైస్-ఛాన్సలర్ కు రెండు వేల రూపాయల జీతము, మోటారు అలవెన్సుగా 150-200 రూపాయల వరకు కేటాయించారు. ఉన్నతోద్యోగుల జీతాలు తగ్గించవలెనని ప్రజలందరూ కోరుతున్నప్పుడు ఆ విషయాన్నే పట్టించుకోకుండా వైస్-ఛాన్సలర్ కు రెండు వేల రూపాయల వరకు జీతం కేటాయించడంలో ప్రభుత్వం యొక్క policy ఏమిటో నాకు అర్థంకావడం లేదు. ఈ విషయంలో మిగతా యూనివర్శిటీల వైఖరి ఏమిటో పరిశీలించినప్పుడు-సిండికేటు కాని, లేక యితర authorities కాని వైస్-ఛాన్సలర్ యొక్క జీతం నిర్ణయించడం జరుగుతున్నది.

ఒకవైపున ప్రభుత్వశాఖల్లో దుబారా తగ్గించవలెనని అనర్గళంగా చెబుతూ—మరొకవైపున ప్రభుత్వం - వైస్ ఛాన్సలర్ కు 2 వేల రూపాయల జీతం, పైగా కారు అలవెన్సుగా 200 రూపాయలవరకు కేటాయించడం చూస్తే ప్రభుత్వం తాను వెల్లడిచేసిన వైఖరిని కించిత్తుకూడా మార్చుకొనడానికి సిద్ధంగా లేదని స్పష్టమవుతోంది. వైస్ ఛాన్సలర్ కు ఒక్క వెయ్యి రూపాయల వరకు జీతంగా కేటాయించడం సమంజసమని మా పార్టీ యొక్క ఏకాభిప్రాయం. అసలు ప్రభుత్వం వైస్ ఛాన్సలర్ యొక్క జీతం రెండువేల రూపాయలని బిల్లులోనే ఎందుకు Provide చేయవలసి వచ్చిందో నా కర్థం కావడంలేదు.

ఇది ప్రభుత్వం యొక్క general policy ఏమిటో సూచిస్తోందని నేను మనవి చేయుచున్నాను.

ఇక composition of the Senate యొక్క విషయంగురించి Bill లో చదివినట్లయితే అది ప్రతి ఒక్కరిని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. Senate సభ్యత్వం విషయంలో డబ్బుగలవారికి un-limited representation ను కలుగ జేశారు. ఇంతకు పూర్వం ఆంధ్ర యూనివర్శిటీలో 25 వేల రూపాయిలు గనుక ఒక్క పర్యాయం యివ్వగలిగారంటే — వారికి Senate లో life membership ఏర్పాటు చేయబడుతూం దేది. బహుశా ఈ పద్ధతి తిరుపతి వేంకటేశ్వర యూనివర్శిటీలో కూడా అమలు జరుగుతూ వుంటుందనే అనుకుంటున్నాను. కాని ఉస్మానియా యూనివర్శిటీ బిల్లులో అదేమీ లేదనుకుంటాను.

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు : ఇదివరకు చార్టర్ లో లేదంటారా?

శ్రీ రావి నారాయణరెడ్డి : ఒకవేళ ఆ విధంగా ఉంటే అది తప్పు అంటాను.

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు : ఉన్నదా, లేదా అనిగాదు. దీని విషయంలో మీ అభిప్రాయం తెలియజేయండి.

శ్రీ రావి నారాయణరెడ్డి : ఒకవేళ మంత్రిగారు తెలిపినట్లుగానే ఉస్మానియా యూనివర్శిటీ చార్టర్ లో ఆ విధంగా ఉంది అనుకుందాము. డబ్బు ఉన్నవారికి ఈ విధంగా Senate లో ప్రాతినిధ్యం యివ్వడం పూర్తిగా పొరపాటని మా పార్టీ యొక్క ఖచ్చితమైన అభిప్రాయం. దీనియొక్క దుష్ఫలితాలు ఎప్పటికైనా బయటపడితీరుతవని చెప్పడానికి నేను సందేహించడంలేదు. ఒకవేళ డబ్బుగలవారికి Senate యొక్క అవసరం అప్పట్లో వుండెడిదేమో గాని, యిప్పుడుమాత్ర మేమీ ఉండదనే నేననుకొంటున్నాను. ఈనాడు ప్రధానంగా యూనివర్శిటీల యొక్క ఆర్థిక పరిస్థితిని గురించి పరిశీలించినట్లయితే - యూనివర్శిటీలు ఎక్కువగా 'యూనివర్శిటీ గ్రాంట్సు' మీదనే ఆధారపడుతున్నవి గాని, ఈ విధంగా సభ్యత్వానికి వసూలుచేసిన donations పై ఆధారపడవలసిన అవసరం ఉండదని నేను భావిస్తున్నాను. అటువంటప్పుడు డబ్బు గలవారికి యీ స్వరూపంగా సెనేటులో సభ్యత్వాన్ని కల్పించి, వారు యూనివర్శిటీ policies లో ప్రాముఖ్యంకల్పించుకొనెడి అవకాశం కలుగజేయడమెందుకో నాకర్థంకావడంలేదు.

ఇక యీ వ్యవహారంలో ప్రభుత్వం యింతటితో ఆగక, యింకా స్తం ముందుకే వెళ్ళిందని చెప్పాలి. 25 వేల రూపాయలు ఒకేపర్యాయం యివ్వగలిగే వారికి senate లో Life membership ఖాయపడేట్లున్ను, 10 వేల రూపాయలు యిచ్చేవారికి 5 సంవత్సరాలవరకు Senate లో ప్రాతినిధ్యముండేట్లున్ను ఇక మూడువేల రూపాయలు చెల్లించేవారికి ఆ ఒక్క సంవత్సరంవరకే సెనేటులో ప్రాతినిధ్యం వుండేట్లున్ను ప్రభుత్వం ఈ బిల్లులో ఏర్పాట్లు కలుగజేసింది. వీటన్నింటినీ పరిశీలిస్తుంటే యిది ప్రజాస్వామ్య ప్రభుత్వమేనా ? అన్న ప్రశ్న వుదయించడంలో ఆశ్చర్యం ఉండదనుకుంటాను. ఇక గ్రాడ్యుయేట్సుకు, లోకల్ బాడీస్‌కు లిమిటెడ్ రిప్రజెంటేషన్నున్ను, money bags కు మాత్రం un-limited representation కలుగజేసింది ప్రభుత్వం. సెనేటులో ఒక సంవత్సరంవరకు ప్రాతినిధ్యం వుండాలంటే 3 వేల రూపాయలు చెల్లించాలి. అంటే—సెనేటును కొవదలచుకొన్నవాడు—లేక అక్కడ influence సంపాదించదలచుకున్నవాడు ఒక లక్ష రూపాయలు గనుక ఎన్నికలకుముందు ఖర్చుపెట్టినట్లయితే అతనికి సెనేటులో సభ్యత్వంతోబాటు తక్కిన 33 గురు సభ్యుల influence కూడా సంపాదించుకొనడానికి అవకాశ మున్నదన్నమాట.

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు : ఎన్నికలు ఉంటేనే అంటారా ?

శ్రీ రావి నారాయణరెడ్డి : ఒక్క ఎన్నికల విషయంలోనే కాదు. అనేక యితర విషయాలు చర్చకు రావచ్చు, అనేక ముఖ్యమైన నిర్ణయాలు చేసుకొనవలసి రావచ్చు. ఒకవేళ మంత్రిగారు ఎన్నికల గురించి అంగీకరించేందుకు సిద్ధంగా వుండవచ్చు. మాకు ఎలాగూ మెజారిటీవుంది గనుక ఎన్నికలో ఎలాగూ గెలవకపోతామా అనే ఉద్దేశంతో మంత్రిగారు Bill pass కాకముందే విషయాలన్నీ చెబుతున్నారు.

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు : గౌరవసభ్యులు బిల్లును ఒకే దృక్పథంతో గాకుండా మొత్తం బిల్లునంతా దృష్టిలో పెట్టుకొని, సమగ్రంగా పరిశీలించి, విమర్శిస్తే బాగుంటుంది. ఎన్నికలపద్ధతిగనుక ఉండనట్లయితే నష్టమేమిటోకూడా గౌరవసభ్యులు సూచించవచ్చు.

I am not presuming nor can I take the views of the House now. I must know when it comes to finality.

శ్రీ పి. సుందరయ్య : మంత్రిగారి దృష్టిలో వైస్ ఛాన్సలర్ ఎన్నిక అయితే Senate యొక్క ఉపయోగం వుంటుంది, లేకపోతే Senate యొక్క ఉపయోగం లేనేలేదని......

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు : అసలు Senate composition ఎందుకో, దానియొక్క powers ఏమిటో, అది నిర్వర్తించవలసిన విధులేమిటో తెలుసుకొని గనుక గౌరవసభ్యులు ప్రసంగించితే చాలా బాగుంటుంది.

శ్రీ పి. సుందరయ్య : ఎన్నో ఉత్కృష్టమైన అధికారాలు కలిగిన సెనేటుపై యీ విధంగా డబ్బు ఖర్చుపెట్టి ప్రాతినిధ్యం కొనుక్కొనే అవకాశం కలుగజేయకూడదని నా అభిప్రాయం.

శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు : వివరాలు చివరిలో మనవి చేస్తాను.

శ్రీ రావి నారాయణరెడ్డి ; ఎన్నికల సమస్య ఏవిధంగా పరిణమిస్తుందో తెలియదు - ఒక్క ఎన్నికలే యిందులో ప్రధానంకాదు. senate లో ఎన్నో అతి ముఖ్యమైన యితర సమస్యలు పరిష్కారం నిమిత్తం వస్తాయి. సిండికేట్ సభ్యుల ఎన్నికకూడా ఉంటుంది. ఆ విషయం మరచిపోతున్నారు. అందుచేత యిందులో money bags కు ప్రాతినిధ్యం యివ్వడం న్యాయంకాదు. దానికి మేము పూర్తిగా వ్యతిరేకిస్తామని మనవి చేస్తున్నాను.

ఇక బిల్లులోని రెండవ విషయమేమంటే డబ్బు పెట్టి సెనేటులో ప్రాతినిధ్యం కొనుక్కున్నవారు - సెనేటు సమావేశాలకు ఎల్లప్పుడూ వారే హాజరు కానవసరంలేదట. వారి తరఫున వారి agents హాజరవుతుండవచ్చును. ఆవిషయంకూడా Bill లో provide చేశారు. 25 రూపాయలు చెల్లించినవానికి అదే విధంగాను; 10 వేల రూపాయలు చెల్లించినవానికీ అదేవిధంగాను ; 3 వేల రూపాయలు చెల్లించినవానికి అదేవిధంగాను బిల్లులో అవకాశాలుకలుగజేశారు. బహుశా ఏయితర యూనివర్శిటీలలోను యీవిధానం లేదని నేననుకుంటున్నాను. 25 వేల రూపాయలకు ప్రాతినిధ్యం లభించేవిధానం ఆంధ్ర, తిరుపతి, ఉస్మానియా విశ్వవిద్యాలయాలలో వున్నట్లు మంత్రిగారు అంటున్నారు. కాని ఉస్మానియా యూనివర్శిటీలో యీ విధానం లేదనే నా అనుమానం; ఆవిషయం తెలుసుకొనడానికే ఉస్మానియా యూనివర్శిటీ చార్టరుకొరకు మన ఆఫీసు లైబ్రరీ కూడా వెతికాను.

అయితే యితర అన్ని యూనివర్శిటీలలోని మంచివిషయాలన్నీ మన యూనివర్శిటీలకు రూపొందించేట్లుగా Bill తయారు చేశామని మంత్రిగారు అనుకొంటున్నట్లున్నారు, అయితే ఈవిధంగా డబ్బుద్వారా ప్రాతినిధ్యం లభింపజేసే యూనివర్శిటీ ఏదైనా ఉందా ? ఆవిధంగా ఫలానా యూనివర్శిటీ వుందని మంత్రిగారు తెలియజేసినట్లయితే నేను ఎంతో సంతోషిస్తాను. దాన్ని విమర్శిస్తానుకూడా - ఇంతకుముందే డాక్టర్ రాధాకృష్ణన్ అధ్యక్షతన

**University Grants Commission** వారు యీ పద్ధతిని పూర్తిగా వ్యతిరేకించారు; విమర్శించారని కూడా యీ సందర్భంలో ఉదహరించవలసి వుంటుంది.

ఇతర విశ్వవిద్యాలయాలలో ఇటువంటిది ఉన్నదో లేదో తెలియక పోయినా, బహుశా ఉండదని నా అభిప్రాయంగా మనవిచేస్తున్నాను. మిగతా విషయాలు తీసుకోండి. బిల్లులో నామినేషన్ల పద్ధతికి ఎక్స్ అఫీషియో పద్ధతికి చాలా ప్రాధాన్యత ఇవ్వబడిఉన్నది. నామినేషన్ల పద్ధతి అనేది ఉండవలసిన అవసరంలేదు. కొంతమంది విద్యావేత్తలు, ప్రొఫెసర్లు ఉంటారు, వారిని ఎక్స్ అఫీషియోగా వేసుకోవలసి ఉంటుంది అంటే దానిని అంగీకరించడానికి సిద్ధంగానే ఉన్నాము, కాని నామినేషన్ల విధానం మాత్రం మాకు అర్థంకావడం లేదు. కొందరు ఎన్నికలద్వారా వచ్చే అవకాశం కల్పించి మరికొంతమందిని ఛాన్సెలరుచేత నామినేట్ చేయించే పద్ధతి సక్రమమైన పద్ధతిగా కనిపించడం లేదు. నామినేషన్లు పోవాలనేది మా అభిప్రాయం. ప్రాతినిధ్యంగురించి చర్చించేటప్పుడు మరొక విషయం ఉన్నది. పట్టభద్రుల ప్రాతినిధ్యం విషయం. అది సక్రమమైనదే, పదిహేను స్థానాలవరకు ఇవ్వడం కొంచెం ఎక్కువేనని మేము అనుకుంటున్నప్పటికి మేము దానిని అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నాము. పట్టభద్రులకు ఉపాధ్యాయ వృత్తిలో అంతగా శ్రద్ధ ఉండదు. పట్టభద్రులందరు ఉపాధ్యాయులు కారు. నిజంగా ఉపాధ్యాయవృత్తిలో ఉన్న వారికి ఇందులో తక్కువ ప్రాతినిధ్యం నామినేషన్లద్వారా ఇవ్వబడింది. ఇది పూర్తిగా పొరబాటు అని మేము అభిప్రాయపడుతున్నాము. పట్టభద్రులకు ఇచ్చిన ప్రాతినిధ్యం అట్లాగే ఉంచినా - దానిని తగ్గించాలని మా అభిప్రాయం కాకపోయినా - ఉపాధ్యాయులకు ఎక్కువ ప్రాతినిధ్యం ఉండాలని అది నామినేషన్ల పద్ధతిద్వారా కాకుండా వారి సంఘాలద్వారానో వేరే ఏజెన్సీల ద్వారానో ఉపాధ్యాయులుకూడా సెనేటులోనికి ఎన్నుకోబడే విధానం అనుసరించాలని మా అభిప్రాయం. పట్టభద్రులకంటె ఎక్కువ ప్రాతినిధ్యం వారికివ్వాలని మా అభిప్రాయం. పట్టభద్రులకంటె కూడా ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న వారికి విశ్వవిద్యాలయంతో సన్నిహిత సంబంధం ఉండాలని, అందుచేత వారికి ఎక్కువ ప్రాతినిధ్యం ఉండాలని మా అభిప్రాయం. ఆ విధంగా సమకూర్చడానికి తగిన సవరణలను మేము ప్రవేశపెడుతున్నాము. తరువాత జిల్లాకు ఒకరు చొప్పున స్థానిక సంస్థలనుండి ప్రతినిధులుండాలని ఉన్నది. తెలంగాణాలోని మునిసిపాలిటీ సభ్యులు, గ్రామ పంచాయితీ అధ్యక్షులు కలిసి జిల్లాకు ఒకరు చొప్పున సభ్యులను ఎన్నుకోవాలని బిల్లులో ఉన్నది. ఇది సక్రమమైన పద్ధతి కాదని మేము అనుకుంటున్నాము. ఎన్ని విధాల ఆలోచించినా ఇది సక్రమ

మైన పద్ధతి కాదు. స్పష్టంగా ఒక విషయం మనవి చేయదలచుకున్నాను. ఇది ఒక ప్రత్యేకమైన ఉద్దేశంతో తెచ్చారు. జిల్లాకు ఒకటి అయినట్లయితే ప్రతిపక్షంవారిని పూర్తిగా లేకుండా చేయడానికి వీలు ఉంటుందనే అభిప్రాయంతో దానిని తీసుకువచ్చారని మా అభిప్రాయం. జిల్లాకు ఒక సీటు అయినట్లయితే మెజారిటికి మాత్రం ఆ స్థానం వస్తుందికాబట్టి మొత్తం తెలంగాణా జిల్లాలనుంచి వచ్చే వారందరిలో ఒక్కరుకూడ ప్రతిపక్షం వారు లేకుండా పోతారు. ఇటువంటి ప్రత్యేకమైన ఉద్దేశంతో జిల్లాకు ఒక్కరు అని పెట్టారని మా ఖచ్చితమైన అభిప్రాయం. ఇందులో మార్పు రావాలని కోరుతున్నాము. కనీసం జిల్లాకు ముగ్గురినైనా ఇవ్వండి. ఈ ఎన్నికలో సర్పంచీలు మాత్రమే పాల్గొనడం సక్రమమైన పద్ధతికాదు. మునిసిపాలిటీ సభ్యులతోపాటు గ్రామపంచాయితీ సభ్యులకు ఎన్నుకోవడానికి అవకాశం ఇస్తే ఇంకా ప్రజాస్వామికంగా ఏర్పడడానికి అవకాశం ఉంటుంది అని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఆంధ్ర, తిరుపతి విశ్వవిద్యాలయాల సందర్భంలో కూడా ఇటువంటి ప్రాతినిధ్యం ఇచ్చారు. బహుశా నామినేషన్లద్వారా ఇచ్చారను. కుంటాను.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : విశ్వవిద్యాలయ ప్రాంతములలో ఎన్నికలద్వారాను, మిగతాచోట్ల నామినేషన్లద్వారాను—

శ్రీ రావి నారాయణరెడ్డి : అదికూడా సక్రమమైన పద్ధతికాదనే మనవి చేస్తున్నాను. మిగతాచోట్లకూడా ఎన్నికల పద్ధతి పెడితేనే బాగుంటుందని అనుకుంటున్నాను. ప్రాతినిధ్యం మూడుకంటె అయిదు ఇస్తే బాగుంటుందని మా అభిప్రాయం. ఎక్స్అఫీషియో పద్ధతిలో హైదరాబాద్, సికిందరాబాదు మేయర్లకు ఎందుకు ప్రాతినిధ్యం ఇచ్చారో అర్థం కావడంలేదు. వారు అవసరమైనట్లయితే ఎన్నుకోబడితే బాగుంటుందని మా అభిప్రాయం. Circle Commander of the National Cadet Corps, Andhra Pradesh అని ఒక ప్రాతినిధ్యం ఇచ్చారు. అదికూడా ఎందుకు ఇచ్చినారో మాకు అర్థం కావడం లేదు. దీనినికూడా తీసివేస్తే బాగుంటుందని మా అభిప్రాయం. ఈ విషయమై మంత్రిగారేమైనా వివరణలు చెబితే మా అభిప్రాయాన్ని మార్చుకోనవలసి ఉంటే మార్చుకుంటాము, కాని ప్రస్తుతానికి ఇది మాకు అర్థంకావడంలేదు. విశ్వవిద్యాలయంలోని Professors, Heads of Government departments, Principals of the University constituent and affiliated colleges - ఇవన్నీ సక్రమంగానే ఉన్నాయని మా అభిప్రాయం. The wholetime University

professors and other Professors appointed by the University అన్నారు. ఇది ఏమిటో మాకు గ్రాహ్యం కాలేదు. University Professors అంటే యూనివర్శిటీలోని ఇతర కాలేజీలలోని ప్రొఫెసర్లు ఎవరైనా ఉంటే వారికి స్థానం ఉంటుందా లేదా అనేది మాకు అర్థం కాలేదు. వారికికూడా స్థానం ఉండాలని మా అభిప్రాయం. ఎక్కడ ప్రొఫెసర్లున్నప్పటికి, Affiliated Colleges లో ఉన్నా constituent and affiliated Colleges లో ఉన్నా, వారికి స్థానం ఉండాలని మా అభిప్రాయం. కొన్ని విషయాలు మాత్రమే చెప్పినాను; కొన్ని మిగిలిపోయి ఉండవచ్చును. సెనేటు composition మార్చవలసి ఉంటుంది ప్రభుత్వంవారు ఏ ఉద్దేశంతో ఈ బిల్లును తెచ్చారో ఆ ఉద్దేశాలను మార్చుకోవలసి ఉంటుంది. డబ్బుకు సంబంధించిన మా ఆక్షేపణ చాలా తీవ్రమైన ఆక్షేపణ. ఆ విధంగా ఉంటే డబ్బుగలవారికి సినేటుమీద పూర్తి అధికారం దొరికే ప్రమాదం ఉన్నది. సినేటు composition ను గురించి ఈ విషయాలు మాత్రమే మనవి చేస్తున్నాను. తరువాత సవరణల రూపంలోను సెలక్టు కమిటీలోను వివరాలకు సంబంధించిన సవరణలను చేయడానికి వీలుంటుంది. సిండికేటుకూడా పూర్తిగా ఎక్స్అఫిషియో, నామినేటెడ్ సభ్యులతో నిండి ఉన్నది. 14 మందిలో nominated and ex-officio సభ్యులు కలిసి 8 మందివరకో, 10 మందివరకో ఉంటారు అనుకుంటాను. ఇది సరికాదని సెనేటునుంచి ఎన్నుకోబడిన వారి సంఖ్యను పెంచాలని మాత్రమే మనవి చేస్తున్నాను. నలుగురికి మాత్రమే అవకాశము ఇచ్చారు. ఇది కొంతవరకు ప్రజాస్వామిక సూత్రాలకు భిన్నంగా ఉన్నది. ఈ సంఖ్యను ఆరునకు కాని, ఎనిమిదికి గాని పెంచాలని సూచిస్తున్నాను. ఈ బిల్లును గురించి ప్రధానంగా ఈ ఆక్షేపణలున్నాయి మాకు. ఇతర విషయాలు ఒకటి, రెండు మనవిచేసి నా ఉపన్యాసాన్ని ముగిస్తాను. ఒకటి, రాజకీయాల కారణంగా వివక్షత చూపించడం, విశ్వవిద్యాలయాలలో కూడా, మిగతా డిపార్టుమెంటులలోవలెనే, విపరీతమైన political discrimination జరుగుతున్నది.

Teachers యొక్క నియామకంలో, Lecturers యొక్క నియామకంలో యితర విషయాలలో అధికారపక్షం మిగతా పక్షాలవారిపై discrimination చూపుతున్నది. అందులో మాపార్టీ దానికి చాలా గురి అవుతున్నది. ఇతర ప్రతిపక్షాలవారుకూడా దానికి గురవుతున్నారు. ఈ మధ్యనే ఒక case వచ్చింది. ఒకాయన First class లో M. A. ప్యాసయినాడు. Thesis వ్రాసి Ph. D. డిగ్రీకూడా పొందారు. అతడు అన్నివిధాలా lecturer పదవికి అర్హుడు. మూడు నాలుగు కాలేజీలకు దరఖాస్తులు పెట్టుకున్నాడు. చాలమంది

సభ్యులకు సానుభూతి వున్నప్పటికీ అతనిని నిరాకరించారు. ఇది అచ్చంగా political discrimination అది మా పార్టీకి సంబంధించిన సమస్య. ఈ బిల్లులో దానిని తీసివేశారా అని చూస్తే అది అట్లానేవుంది. Political discrimination చేయడానికి అవకాశాలు వుంచి ఈ Bill ను రూపొందించారు. ఆ విషయమే మనవి చేస్తున్నాను. The University is open to all persons and creeds అనేదానిక్రింద "No person shall be excluded from holding any office of the University or from membership of any of the authorties of the University or from admission to any degree, diploma or course of study on account only of religion, cast, sect, place of birth or any of them అని మాత్రం చెప్పారు. Political opinion అనే పదంవుంటుందేమో నని ఆశించాను. చాలా జాగ్రత్తగా చదివాను. Political opinion కు కూడా స్థానం యిస్తారేమోననుకున్నాను. అదిమాత్రం లేకుండా చేశారు. మదరాసు యూనివర్సిటీ చార్టరులో మాత్రం Political opinion అని వుంది. దానిని copy చేసేటప్పుడు అదిమాత్రం తీసిపారేశారు. అది తీసిపారేసిన తరువాత మిగతా democratic Principles పై caste, creed religion సమానముగా చూస్తామన్నారు. ఇది పెద్ద Democracy కాదు. 200 సంవత్సరాల క్రిందటి democracy. ఈనాటి democracy కాదు. ఈనాడు opposition ను ఎట్లా చూస్తారనేదే గీటురాయి. అందుచేత political discrimination అనేది చేర్చి సక్రమంగా రూపొందించాలని మనవి చేస్తున్నాను. సవరణల సమయం వచ్చినప్పుడు దానికి తగుసవరణలు పెడతాం. మంత్రిగారు అంగీకరిస్తారని నా విశ్వాసం.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు : ఈ విశ్వవిద్యాలయాలలో కూడా political గొడవలెందుకని మేము తీసివేశాము.

శ్రీ రావి నారాయణరెడ్డి : వారు చేస్తున్నారు కనుకనే నేను మనవి చేస్తున్నాను. ఆ political గొడవలు లేకపోతే యీ political గొడవలు రాక పోయేవి. వారు political గొడవలు లేవదీస్తున్నారు. ప్రతి step లో, విశ్వ విద్యాలయాలలో, ప్రతి డిపార్టుమెంటులలో అలా జరుగుతున్నది. కమ్యూనిస్టు పార్టీ వాసన వున్నట్లుగా వుంటే ఉద్యోగంలేకుండా చేస్తున్నారు. విశ్వవిద్యా లయాలలో కూడా political గొడవలెందుకని మంత్రిగారు చిలుకపలుకులు పలుకు తున్నారు. అది సక్రమమైన పద్ధతి కాదని మనవిచేస్తున్నాను. చివరకు ఒక విషయం చెప్పాలి. దానికి బిల్లులో స్థానంవుందో లేదో చెప్పలేనుగాని అది చాలా ముఖ్యమైన విషయం. అది medium of instruction గురించినది. దానిగురించి

ఈ బిల్లులో ఎక్కడాలేదు. దానిగురించి ప్రభుత్వం policy ఏమిటో యీమధ్యనే చర్చలోకివచ్చింది. Official Language గా అంగీకరించడానికి సిద్ధంగాలేరు. University విషయంలో medium of instruction గా తెలుగును పెట్టడానికి సిద్ధంగాలేరు. Language సంబంధముగా ప్రభుత్వంవారి policy ఏమిటో ప్రపంచం అర్థంచేసుకోలేదు. మేముకూడా అర్థంచేసుకోలేని స్థితిలో వున్నాం. వారి policy ఏమిటి? అధికారభాషగా ఇంగ్లీషుకిగల స్థానం ఏది తీసుకుంటుంది? కొందరు హిందీ ఉన్మాదులున్నారు. వారు ఇంగ్లీషుభాష స్థానే హిందీని తీసుకు రావాలని ప్రచారంచేస్తున్నారు. యూనివర్సిటీలలో మాతృభాషద్వారానే విద్య గరపాలనే రిపోర్టులున్నాయి. దానివిషయమై ప్రభుత్వం policy ఏమిటి? ఇంత వరకు మంత్రిగారు ఇంగ్లీషుపైన చాలా అభిమానంవున్నట్లు అప్పుడప్పుడు ప్రకటనలు చేస్తూంటారు. medium of instruction గురించి మంత్రిగారు తమ సమాధానంలో చెబుతారని ఆశిస్తున్నాను. హైదరాబాదు యొక్క పరిపాలనలో మేము ఎన్నో బాధలుపడ్డాము. ఒక High School ను—అందులో Girls High School ను తెలుగు Medium of instruction పెట్టి Osmania University కి affiliate చేయమన్నాము. నిరాకరించారు. ఆ విధంగా బాధలుపడ్డాము. ఉర్దూ బదులు ఇంగ్లీషును నెత్తిమీద పెట్టుకోమంటారా. ఇదేమి న్యాయమో అర్థం కావడంలేదు. కార్వే యూనివర్సిటీకి affiliate చేసుకుని పరీక్షలు దాని ద్వారా ఏర్పాటు చేశారు. దాని తరువాత ఆంధ్ర యూనివర్సిటీ బెజవాడలో అవకాశం కలుగజేసింది. కాని ఆ College లో కూడా కాలేజి దశలో ఇంగ్లీషుకు మారుతారు. Matriculation వరకు తెలుగులో చెప్పి అక స్మాత్తుగా కాలేజి దశలో ఇంగ్లీషుకు switch on కావడంవల్ల విద్యార్థులు చాలా బాధపడుతున్నారు. అధికార భాషకు medium of instruction కు అవినాభావ సంబంధం వుంది. తెలుగులో చదివి అధికార భాష మారక పోతే వా రెక్కడికి పోతారు? దానిగురించి ప్రభుత్వం policy అర్థం చేసుకోకుండా వున్నాం. అది పూర్తిగా అభివృద్ధి నిరోధకంగా వుంది. ముఖ్య మంత్రిగారు దానిగురించి mention చేసినప్పుడల్లా చాలా ఉద్రేకంగా మాట్లాడు తారు. ఇది చాలా ప్రజాస్వామికమైన విషయం. దాన్నిగురించి ప్రభుత్వం ఏ విధానం అవలంబిస్తుందో అర్థం కావడంలేదు. మొత్తంమీద యీ బిల్లు చాలా అసంతృప్తికరంగా వుంది. ఈ ప్రజాస్వామిక యుగంలో మంత్రిగారీ బిల్లును ఎట్లా తెచ్చారో తెలియడం లేదు. మిగతా విషయాలన్నీ ఆ stage వచ్చినప్పుడు మాట్లాడుతాను. ఈ విషయాలను విద్యామంత్రిగారు ఆలోచిస్తారని ఆశిస్తున్నాం.

మిస్టర్ స్పీకర్ : శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి రెండు సవరణలు ప్రతిపాదించవచ్చును.

*Sri Vavilala Gopalakrishnayya* (*Sattenapalli*): Mr. Speaker, Sir, I beg to move:

"That the Andhra University (Andhra Pradesh Amendment), Bill, 1958, be deferred for one year."

"That the Andhra University (Andhra Pradesh Amendment), Bill, 1958 be circulated for the purpose of eliciting public opinion."

"That the Sri Venkateswara University (Andhra Pradesh Amendment) Bill, 1958, be deferred for one year."

"That the Sri Venkateswara University (Andhra Pradesh Amendment) Bill, 1958, be circulated for the purpose of eliciting public opinion."

*Mr. Speaker:* Motions moved.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అధ్యక్షా, Osmania Univesity కి సంబంధించినంతవరకు సవరణలు move చేయడంలేదు. తక్కిన రెండిటికే move చేస్తున్నాను. మొత్తం మూడు బిల్లులలోను Osmania University కి క్రొత్తగా శాసనసభ ద్వారా అంగీకరించే శాసనాన్ని ఏర్పరచడం వరకూ ప్రభుత్వాన్ని అభినందించడం తప్పితే మిగతా భాగం దేనిగురించీ కాదు. ఆంధ్ర యూనివర్సిటీ, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీలలో ఉస్మానియా యూనివర్సిటీలో తాము పెట్టదలచిన అవకతవకలనే పెట్ట నుద్దేశిస్తున్నారు. వాళ్ళ ముక్కుమాత్రం చెక్కితే ఎట్లా బాగుంటుంది? తక్కిన ముక్కులన్నీ చెక్కినట్లయితే అందరూ ముక్కులేనివారైతే చాలా బాగుంటుందనే రూపంలో చూపించడానికి చేసే దుష్ప్రయత్నమని చెప్పక తప్పదు. ఆంధ్ర యూనివర్సిటీని ఉన్నతాశయాలతో ప్రారంభించారు. దానికి ఒక constitution వుంది. ఇంతవరకు ఎంతోమంది challenge చేసినప్పటికీ రాజకీయాలు ప్రతిబింబించాలని ప్రయత్నించినప్పటికే శ్రీ సి. ఆర్. రెడ్డిగారు ఎప్పుడైతే అవతల నిలబడ్డారో వారికి వ్యతిరేకంగా కాంగ్రెసు పార్టీకూడా తమ అభ్యర్థిని పెట్టి ఓడిపోవడం జరిగింది. కాని విద్యావేత్తను ఓడించే అవకాశం ప్రజాస్వామికంలో యిచ్చినా ఓడించలేనిస్థితి ఆంధ్ర యూనివర్సిటీ 30 సంవత్సరాలుగా నిలిపిందని మరచిపోవద్దు. రాజకీయాలకు అతీతమైనపద్ధతిలో ఆంధ్రయూనివర్సిటీ నడిచింది. నేడు ఆఖ్యాతి దేశం మొత్తంమీద ఆంధ్రయూనివర్సిటీకి వుంది. ఉస్మానియా యూనివర్సిటీలో తమ అధికారాలను తమ రాజకీయాలను దూర్చేది ఎట్లా అని ఆలోచించి

ఆలోచించి విద్యార్థుల అభిప్రాయానికి వ్యతిరేకంగా తెలంగాణా ప్రజానీకము
యొక్క అభిప్రాయానికి వ్యతిరేకంగా వారి నెత్తిన పెత్తనం చేయడానికి
ఉద్దేశించి nomination ప్రాతిపదిక ప్రారంభించారు. దానిని ఆంధ్రప్రదేశ్‌లో
ఉన్న అన్ని యూనివర్శిటీలకు అన్వయిస్తామని అంటున్నారు. ప్రభుత్వం
decentralization సిద్ధాంతం మరచిపోయి కేంద్రీకృత విధానం అవలంబించి
సర్వాధికారాలు తాము తీసుకోవాలని చేసే దుష్ప్రయత్నం యిది అని చెబు
తున్నాను. కేంద్రీకృతముగా ప్రభుత్వం అధికారం చూరగొనడానికి ప్రయత్నిం
చడం అన్యాయమని డాక్టరు రాధాకృష్ణన్ కమీషనువారు చెప్పారు. ఇంగ్లం
డులో చూడండి; అమెరికాలో చూడండి; అక్కడున్న యూనివర్శిటీలకు
కావలసిన స్వేచ్ఛను పూర్తిగా యిస్తున్నారు. ప్రభుత్వంవారికి కావలసిన డబ్బు
యివ్వడం, యూనివర్శిటీలను అభివృద్ధి చేయడానికి కావలసిన త్రాణ యివ్వడం.
ఆ రాజకీయాలకు అతీతంగా వుంచడం అక్కడ జరుగుతున్నది. కాని ఇక్కడ
సర్వాధికారాలు ప్రభుత్వం తీసుకోవడం, డబ్బు యిచ్చేటప్పుడు ఎగగొట్టడం
అనే పద్ధతి ప్రారంభమవుతున్నది. ఏ యూనివర్శిటీని చూచినా అది starve
అవుతున్నది. అడిగితే డబ్బు లేదంటారు. అధికారాలు స్వాధీనపరుచుకుంటూ
అప్పుడప్పుడు తెచ్చే యీ బిల్లులు అచ్చువేసి వాటిపై చర్చలుచేసి ఖర్చుచేసే
ధనము యూనివర్శిటీలకు ఖర్చుచేస్తే కొంతన్నా పని జరుగుతుందేమోననిపించు
తున్నది. అడిగినప్పుడు డబ్బులేదని మొండిచేయి చూపిస్తారు. ఆ మొండిచేయి
మాత్రం పిడికిలితీసుకుని నెత్తినిమొట్టే పద్ధతిమాత్రం ఆంధ్ర ప్రభుత్వం అవలం
బిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ వచ్చినందువల్ల వచ్చిన కష్టమూ, నష్టమూ బాధ యిటు
తెలంగాణా ప్రజానీకం అటు ఆంధ్ర ప్రజానీకం పడవలసిన స్థితి వచ్చింది. విశ్వ
విద్యాలయాలస్థితి ఆలోచిస్తే ఎంత అధోగతిలో వుందో బోధపడుతుంది. విద్యా
విధానం అంతకంటే అధ్వాన్నంగా వుంది. భాషాప్రయుక్తరాష్ట్రాలు వచ్చాయి.
భారతదేశం మొత్తంగా భాషాప్రయుక్తరాష్ట్రాలు రాకపూర్వమే ఆంధ్ర
రాష్ట్రం సాధించుకొన్నాము. తెలుగుభాషలో వ్యవహారం నడుపుకొనేందుకు
ప్రయత్నించాము. అది జరగలేదు. మద్రాసుప్రభుత్వములో ఉన్నప్పుడు—వారు
ఏమన్నారంటే "మీరు తెలుగులో చదువుకుంటే మేము ఉద్యోగాలు యిచ్చే
టప్పుడు చిక్కువస్తుంది" అని అంటే, ఆ ప్రభుత్వం క్రింద తాబేదార్లుగా పడి
వుండటం ఎందుకని, మన తెలుగుభాషకు అభివృద్ధి లేదని, రాష్ట్రం ఎప్పుడు
వస్తుందా అని ఎదురుచూచాము. రాష్ట్రం వచ్చింది. ఇంగ్లీషు అక్షరాలలో
వ్రాసుకొనే రాష్ట్రమే గాని, తెలుగుభాషలో వ్రాసుకోగలిగిన పరిణామం
రాలేదు. ఆంధ్రరాష్ట్రం వచ్చింది, ఆంధ్రప్రదేశ్ వచ్చింది, మార్పువస్తుందికదా

అనుకొన్నాము. కాని తెలుగుభాషను ఉపయోగించమంటే యింతవరకు ఎక్కడా ఉపయోగించలేదు. Secondary Education లో standards పడి పోయాయి. చదవండి, చదవండి అంటున్నాము. కాని standards ఎందుకు పడిపోతున్నవో ఆలోచిస్తున్నారా ? చదవకపోవడంలేదు. నూటికి 80 మార్కులు, 50 మార్కులు సంపాదించిన విద్యార్థులు ఉన్నారు. వాళ్లు పరీక్షలు pass అయి యూనివర్సిటీ సీట్లుకోసం apply చేస్తే— "మా వద్ద ఉన్నవి 36 సీట్లు. మిమ్ములను ఎవరు చదవమన్నారు. ఇన్ని మార్కులు తెచ్చుకొని, 300 మంది విద్యార్థులువస్తే అందరికీ మేము ఎక్కడ సీట్సు యిస్తాము?" అంటున్నారు. అందువల్ల, ఉద్యోగంకోసం pass marks సంపాయిస్తే చాలు, అంతేకదా కావలసినది, అని విద్యార్థులు అనుకొంటున్నారు. Intermediate చదివినవాడు B. A. కు పోవాలంటే, Pre-University చదివినవాడు 3 years course B. A. లో చేరాలంటే, లేకపోతే Intermediate ప్యాస్ అయినవాడు మెడికల్ కోర్సుకు పోవాలంటే, B. Sc., ప్యాస్ అయినవాడు పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సుకు పోవాలంటే సీట్సు ఎక్కడఉన్నాయి? ఇంతవరకు యివ్వడం లేదు. ఆంధ్ర యూనివర్సిటీని స్థాపించుకున్నాము. కాని దానిని expand చేయడానికి ప్రయత్నంలేదు. దానిని starving diet లో ఉంచాము. ఉస్మానియా యూనివర్సిటీ ఉన్నది. దానిలో విస్తృతమైనమార్పులు తీసుకురావడానికి ప్రయత్నాలుఏమీలేవు. శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ తీసుకువచ్చాం. దానిని అభివృద్ధి చేయడమనేదిలేదు. అటువంటి ప్రయత్నాలులేకుండా వైస్‌ఛాన్సెలర్ మనచేతిలో ఉంటాడా, లేదా, అనే ఆలోచన. అర్హతలుకూడా లేనివారు వైస్‌ఛాన్సెలరును అప్పాయింట్ చేసి, వైస్‌ఛాన్సెలర్ ఆనరరీ డిగ్రీ ఇచ్చేపద్ధతి Constitution లో create చేసి డాక్టరేట్ డిగ్రీ సంపాదించుకొనుటకు వేసిన ఎత్తుగా కనపడుతున్నది తప్పితే రెండోది లేదని నేను చెప్పకతప్పదు. Constitution చూస్తే వైస్‌ఛాన్సెలరుకు all pervading powers ఇస్తున్నారు. అందువల్ల ఈ విధానాన్ని మాత్రం ఏమీ సహించడానికి వీలులేదు. యూనివర్సిటీస్‌ను అభిప్రాయం అడగమన్నారు. కాని ప్రభుత్వముఏమైనా ప్రజాభిప్రాయాన్ని గుర్తిస్తున్నదాఅని అడుగుతున్నాను. ఆంధ్రయూనివర్సిటీ, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ, ఉస్మానియా యూనివర్సిటీ ప్రభుత్వానికి అభిప్రాయాలు పంపించారు. ఏమని పంపించారో ప్రభుత్వం చెప్పగలదా ? చెప్పదు. ఎందుకంటే వ్యతిరేకంగా అభిప్రాయంవుంది కనుక చెప్పడానికి సాహసంలేదు. ఆంధ్ర యూనివర్సిటీనుంచి వచ్చినదానిలో ఒకే

మాట చెప్పారు. ఇక్కడఉన్న డెమొక్రటిక్ సెటప్‌లో ఏమీ మార్పు చేయుటకు వీలులేదు కనుక దీనిని ఒప్పుకొనుట లేదని చెప్పారు. ఆ తీర్మానం తమకు చదివి వినిపిస్తాను :

"The Senate recommends to the Government that clauses (a), (b), (c) and (h) of Section 12 of thc Principal Act need not be amended or changed so as to allow the Chancellor to be nominated from the panel suggested by a Committee of three persons, which is contrary to the existing democratic process of electing Vice-Chancllor." అని వారు చెప్పారు. శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీకూడ దానినే పూర్తిగా బలపరుస్తూ మార్పు చేయనక్కరలేదని చెప్పారు. ఉస్మానియా యూనివర్సిటీ కూడ ఒక ప్రతిపాదన పంపించింది. దానినే హర్షముతో ఆమోదించామన్నారు. Pro-chancellor మాకు అక్కరలేదని వారు అంటే, ఇదైనా ఒప్పుకుంటే చిక్కులేకుండా పోతుందని Pro-Chancellor ను తీసివేస్తామన్నారు. అయితే ప్రభుత్వం Pro-chancellor ను తీసివేయదలచుకుంటే, తక్కిన యూనివర్సిటీస్‌లో ఎందుకు తీసివేయలేదు ? ఎందుకు తీసివేయలేదంటే వాళ్ళుకూడా వద్దన్నప్పుడు మానుకుందాము అన్నమనే పద్ధతిని ఉరుకున్నారు. అయినా Pro-Chancellor పదవి మేకకు మెడక్రింది పాలుయివ్వనివి ఉన్నట్లు అంతకన్నా ఏమీలేదు. తెలంగాణావారి అభిప్రాయాన్ని సంతృప్తిపరచామనేమాట ఈ ఒక్క పాయింట్‌లోనైనా చెబుదాము, 100 పాయింట్సులో ఒక్క పాయింటు చెబితే మిగతా రెండు సున్నాలు. సున్నాలేగనుక బాగాఉంటుందనే అభిప్రాయంతో Pro-Chancellorను తీసివేయడానికి ఒప్పుకొన్నామని చెప్పారు. కానిఉస్మానియా యూనివర్శిటీ బిల్లు అంతా చదివితే మూడు, నాలుగు మాటలు కనపడతాయి. Appointed Committees, Coopted Committees, Nominated Cmmittees అనేవి కనపడతాయి గాని Elected-Committee అనేది కనపడుతుందా అంటే లేదు. అంటే మనము చేసిన ప్రజాస్వామిక ప్రయాణం అంతా వృథా. మనం ఎన్నాళ్ళనుంచో చేసిన ఆందోళన అంతా వృథా. ప్రతిదీ ప్రొవిన్షల్ గవర్నమెంటు చేతుల్లో ఉంటుంది. అటువంటప్పుడు Provincial Government కు యూనివర్శిటీకు ఏమీ తేడాలేదు. ఛాన్సెలరుకు, గవర్నమెంటుకు ఏమీ తేడా లేదు. గవర్నరే ప్రో ఛాన్సలర్. గవర్నరు అంటే గవర్నమెంటే కదా. గవర్నమెంటు అప్పాయింట్ చేయాలి. ఇవ్వాళ వైస్-ఛాన్సెలరును ఎవరిని అప్పాయింట్ చేసేది ? అని అడిగితే—ఇద్దరు మెంబర్సు సిండికేటుతో ఎన్నుకోవాలి. ఒక మెంబరును గవర్నరుగారు నామినేట్ చేస్తారు. దానికి ఎవరు కమిటీ అధ్యక్షులుగా ఉండేది గవర్నరుగారే నిర్ణయిస్తారుట. అంటే ఆ ముగ్గు

రిలో ఒకరు అధ్యక్షులు అవుతారు. మిగతా (సిండికేటు మెంబర్సు) యిద్దరిలో తగాదా వస్తే, అందులో ఒకరు వారితో కలిస్తే సరిపోతుంది. లేకపోతే యింకొక పని చేయవచ్చును. ఏమీరాని ఒకరిని, అడ్డదారిని మరొకరిని, వారికి ఉపయోగమైన candidate ఒకడిని— ఈ ముగ్గురిని పంపిస్తే నన్ను వైస్ ఛాన్సెలర్ గా చేస్తారా? ఈ ముగ్గురిలో అక్షరాలు రానివాడ్ని వైస్ ఛాన్సెలర్ చేస్తారో, లేక ఉన్నవాడిని ఒకడినీ alternate లేదు కనుక అతనినే చేస్తారో? అయితే సిండికేట్ ఏవరు ఏమిటి? సిండికేట్ ఎక్కడినుంచి పుట్టింది? తిరిగితిరిగి ఈ నామినేషన్స్ ఎవరుచేస్తారు? వైస్‌ఛాన్సెలర్. కాబట్టి ఎక్కడ తిరిగినా సెంట్రల్ ఫిగర్ వైస్ ఛాన్సెలర్ దగ్గరే వస్తుంది. దీనికి inspiration ఎక్కడ నుంచి ప్రారంభం అవుతుందంటే— గవర్నమెంటు ఇన్‌స్టిట్యూషన్ నుంచి (సెక్రెటేరియట్ నుంచి కాదనుకోండి) మినిస్ట్రీనుంచి start అవుతుంది. Educational institutions ను యీ విధంగా చేతుల్లో పెట్టుకుంటే education సంగతి ఏమవుతుంది? ఇవాళ ఆంధ్రప్రదేశ్ ఏర్పడిందని మనము సంతోషిస్తున్నాము. కాని ఆంధ్రదేశం బయటకు పోతే education లో పెద్ద expert గా ఉన్నటువంటి ఏ రాధాకృష్ణన్‌నో తప్పిస్తే కొత్తగావచ్చిన generation లో ఒకరినైనా చూపించటానికి ఉన్నారా? Science లో ఆంధ్ర యూనివర్శిటీ చాలా గొప్పదని గౌరవిస్తున్నాము. కాని సైన్సులో ఉన్నతస్థాయికి పోయిన వారు ఎవరైనా ఉన్నారని అనుకొంటున్నారా? ఒకవేళ ఉంటే ఎక్కడ ఉన్నారంటే ఆంధ్రదేశం వదిలిపెట్టిపోతే బాగుపడుతున్నారు. ఆంధ్రదేశంలో గనుక ఉంటే, పాలిటిక్సులోకి enter కాకపోతే వానిగతి అధోగతి అవుతోంది. ఎక్కడైనా chemist బ్రతుకవలసివస్తోంది. ఈ పరిస్థితులలో ప్రభుత్వం ఈ బిల్లును ఎందుకు తీసుకువచ్చింది? ఎందుకు తెచ్చినదంటే ఉస్మానియా యూనివర్సిటీలో చేయదలచుకొన్న అన్యాయం uniformity అనే పేరుతో మిగతా రెండింటిలో చేయాలనుకుంటున్నారు. మొన్ననే రాజేంద్రప్రసాద్ గారు చెప్పారు. కావలసినది యూనిటీగాని యూనిఫార్మిటీ కాదన్నారు. అందువల్ల ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్ ఖచ్చితంగా ఒక resolution ప్యాస్ చేసింది.

"Resolved that the Senate is of the view that there is no need nor is it desirable to have a uniform constitution for the three Universities of the State although there is need for academic co-ordination."

అసలు కావలసినది academic coordination గాని వీరు, వారు సరిగా ఉండాలని, హెచ్చుతగ్గులను సరిచేసి, మనుష్యులను సరిచేద్దామని ప్రయత్నంకాదు.

Uniformity తెస్తామంటే, undemocratic గా ఉండే uniformity కి ప్రయత్నమా ? ఇప్పుడు ఈ విధంగా ఎందుకు చేస్తున్నారో నాకు తెలుసు. ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థుల ఆందోళన ఫలితంగా, అసెంబ్లీలో దానికి జవాబు చెబుతూ మేము త్వరలో బిల్లు తెస్తున్నామని చెప్పారు. కాని జనరల్ గా ఆంధ్ర ప్రదేశ్ లో ఉన్న మూడు యూనివర్శిటీలు సమానంగా చేద్దామని అనుకొన్నారు. దాని ఫలితంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో democratic principles పెట్టవలసి వస్తుందనే భయంతో—uniform గా చేస్తామని. వాటికికూడా ముక్కు చెక్కేసి—సమానంగా ఉన్నారో లేదో చూడండి అని చెప్పడానికి చేస్తున్నారు.

కాబట్టి నేను మనవిచేసేది ప్రభుత్వాన్ని ఆ రెండు యాక్ట్స్ విత్ డ్రా చేయమనండి. ఉస్మానియా యూనివర్సిటీకి సంబంధించినంతవరకు యీ ప్రధాన సిద్ధాంతాన్ని ఎన్నికలకు పెట్టమనండి. విశ్వవిద్యాలయాల్లో మాతృభాషలో విద్యాబోధన జరగవలసిఉంది. ఇదివరకే మద్రాసు యూనివర్శిటీ అక్కడి భాషలో విద్యాబోధన జరపాలని డిసైడ్ చేసింది. అదేవిధంగా మనరాష్ట్రింల్లోని విశ్వవిద్యాలయాల్లో కూడ తెలుగులో విద్యాబోధన జరగవలసిఉంది. స్కూల్ ఫైనల్ వరకు తెలుగులో విద్యాబోధనచేసి, ప్రీయూనివర్సిటీకోర్సులో వెంటనే ఇంగ్లీషులో విద్యాబోధన చేయటంచేత విద్యార్థులకు చాలా కష్టంగాఉంటున్నది. ఇదివరకు ఇంటర్ మీడియట్ 2సంవత్సరాల కోర్సుగా ఉండటంవల్ల, ఫస్ట్ ఇయర్ అంతా, విద్యార్థికి తెలుగునుండి ఇంగ్లీషులోకి సమన్వయం చేసుకోటానికి సరిపోయేది. రెండవ సంవత్సరంలో క్లాస్ సబ్ జెక్టు చదవటం, పరీక్ష పాస్ కావటం జరిగేది. ఆతర్వాత బి. ఏ. కు వెళ్ళటం జరిగేది. ఇప్పుడు ఒక సంవత్సరంలోనే తెలుగునుండి ఇంగ్లీషులోకి సమన్వయంచేసుకొని, పరీక్షకు వెళ్ళి పాస్ కావలసి ఉంటున్నది. ప్రీయూనివర్శిటీ కోర్సు తర్వాత ప్రీ ప్రొఫెషనల్ కోర్సు ఉన్నది. ప్రీయూనివర్శిటీ కోర్సు అయినతర్వాత ప్రీప్రొఫెషనల్ కోర్సుకు వెళ్ళుమని చెబుతున్నాము, కాని యీ కోర్సులకు కావలసిన ఫెసిలిటీస్ లేవు. బి. యస్సీ. లో దాదాపు 60, 70, 90 మార్కులు సంపాదించిన విద్యార్థులు 86 గురు ఆంధ్రయూనివర్శిటీ పరియా నుండి ఉస్మానియా యూనివర్శిటీకి అప్లికేషన్స్ పెట్టారు. "అక్కడ యం. యస్సీ కెమిస్ట్రీ లేదుగనుక, దయచేసి మాకు సీటు ఇప్పించండి" అని వారు అప్లికేషన్స్ పెట్టారు. ఆంధ్రయూనివర్శిటీకి పోయి, "యం. యస్సీ కెమిస్ట్రీ ఎందుకు పెట్టరు? మన ఖర్మం ఏమి కాలింది?" అని అంటే, "మమ్మల్నేమి చేయమంటారు, ఈ స్టార్ వేషన్ డయట్ లో (starvation deit), ఇంకా స్టార్ వేషన్ ఎక్కువ అవుతుందేమోననేటటు

